# డబ్బే ప్రధానం [redacted]

రచయిత:

శ్రీ కో[illegible]లి



ప్రకాశకులు:

పసుపులేటి బాపిరాజు,

శ్రీ సత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్

# సూచన

పాపభీతి - మానాభిమానాలు - వదులుకున్నట్లయితే, సునాయాసంగా డబ్బు పెరుగుతుంది.

అయితే, యిప్పుడు డబ్బుగల శ్రీమంతులందరూ వాటిని వదులుకున్నవారేనా అంటే—

ఏమో!!

సత్యమును నమ్ముకుని ఆత్మగౌరవంకోసం ప్రాకులాడినంతకాలం గొర్రెకు తోకబెత్తెడే!

అనిమాత్రం రూఢిగా చెప్పగలం—

ఇట్లు,

రచయిత.

౧

''డబ్బులేనిజీవితం వృథా! దానికోసం ఏపనిచేసినా తప్పులేదు. నిజమే—అయితే ఏపనిచేస్తే నాదగ్గర డబ్బుచేరుతుంది?

దొంగసంతకాలుచేస్తే డబ్బు వస్తుందంటారు. అయితే అదెలాగో నాకు చేతగాదు కచ్చేరీల్లో తప్పుడుసాక్ష్యాలీయడంవల్లకూడా ధనార్జన చేయవచ్చునంటారు. అయితే ఆపద్ధతికూడా నాకుచేతగాదు.

తరువాత దొంగతనాలు చేయడం—ఓయబ్బో. ఆపని నావల్ల అసలేకాదు.

దేవాలయాలు కట్టిస్తానని—సమారాధనలు చేయిస్తానని చందాలు వసూలుచేసి గుటకాస్వాహా చెయ్యడం. ఈవ్యాపారమేమంత కష్టమయినదికాదు—సులువుగానే చేయొచ్చు. అయితే యిచ్చేదాతలుండాలి.

ఇటువంటి పద్ధతులు కొన్నికనిపెడితే, అందులో నాకు చేతనయినవాటిని అవలంభించి, డబ్బు సంపాదించవచ్చు.

ఏదోపద్ధతిలో నేను పదివేలు, వెధవపదివేలుకాదు—లక్షరూపాయలు సంపాదించగలిగానూ అంటే, అప్పుడందరూ నన్ను గౌరవం చేస్తారు. బోర్డు ప్రెసిడెంటుకూడా అవుతుంది. మ్యునిసిపల్ మెంబరయినా అవుతుంది.

అంతేగాని, చేతిలో పట్టుమని పదివేలు లేకుండా కూర్చుంటే, నాముఖము నెవరు చూస్తారు?

భోజనంహోటలుపెట్టిన భైరవమూర్తి సయితం, ఝూంమంటూ వెలిగిపోతున్నాడు. ఎందుచేత? వాడిదగ్గర పదివేలున్నాయి. ఏవిధానయినా డబ్బు సంపాదించడం—అదీ కావలసింది!

వియ్యన్నపంతులు చేసిందేమిటి?

కాంగ్రెసులో నాయకుడనంటూ ఖద్దరుగుడ్డ చేసుకొని తిరిగి వస్తే తిరిగి, పాతిక వేలు పెట్టి బ్రహ్మా[illegible] మేడకట్టాడు.

అదీ తెలివంటే—

రంగాచారి సంగతీ? అతనుచూస్తే ఆలయంలో పది హేను రూపాయల జీతగాడు. భార్యకు ఒంటినిండా బంగారమే—కాసులపేర్లూ వడ్డాణాలు — గడియారంగొలుసులు—ఒక టేమిటి? కనీసం పదివేల రూపాయల జవ్హారీ వుంటాయేమో వొంటిమీద.

దీనిభావమేమి తిరుమలేశ?

“ఏమయ్యా! ఇంతచిన్న జీతంలో ఆడవాళ్ళకన్ని వస్తూ కేలా చేయించావయ్యా?”

అని నాలాటివాడెవరయినా అడుగుతే ఆచార్లో చిరునవ్వునవ్వి—

“మనదేముందండీ అంతా ఆడవాళ్ళ ప్రజ్ఞ”

అని జవాబు చెబుతాడు.

అయితే అతన్ని కులంలో వెలివేశారా? ఆడదానికంతడబ్బు ఎలావచ్చిందని ఎవరయినా నిలదీశారా? ఉద్యోగస్తులకందరకూ ఆచార్లు తలలో నాలుక. చిన్నపనేగాదు—పెద్దపనేగాదు—

ఆచార్లుతో చెప్పండి—నిమిషాలమీద అయిపోతుంది. అతనికంత పలుకుబడి, అంత గౌరవమూ వుంది.

నామాట ఎవడు వింటాడు?

పాకీవాడిచేత దొడ్లోనితుక్కు ఎత్తించి అవతల పారబోయించలేకపోయాను—ఇంకెందుకండీ నాబ్రతుకు?

అదేనాదగ్గర పదివేలుంటే, ప్రతిఆఫీసరు, ప్రతిషావుకారు నాకు వొంగివొంగి సలాములు చేస్తారు. నేను దేనిని చెప్పినా తలదాలుస్తారు.

ఇప్పుడింతకూ అసలువిషయమును పూర్వపక్షంచేస్తున్నానేమో—

డబ్బుసంపాదించడమెలాగా అన్నది ప్రస్తుతప్రశ్న. అదే ఆలోచన.

నాజీవితమంతా ఆలోచనలతో స
సించి ఒక్కటీ చెయ్యలే

సువర్ణయోగము నాకేమైనా చెబుతారా
వీసెడో—అరవీసెడో ... చాలా

ఆయోగం ఎవరికి తెలుసు?
బంగారం చెయ్యడం సాధ్యమల
కాని బంగారం చెయ్యడం చేతనయిన మనిషి నాకెక్కడా
కనుపించడు

అన్నట్లింకో ముఖ్యమయిన విషయమును మరిచి
దొంగనోట్ల వ్యాపారంచేసి ఆమధ్య ఒక ఆసామీ కోటీశ్వరుడయినాడట!

ఇటువంటి గాలివార్తలు తెలిసినందువల్ల నాకేమిటీ యోగం?

ఆదొంగనోట్ల వ్యాపారము నెలాగ చెయ్యటం—తద్వారా డబ్బు సంపాదించేదెల్లా? ఆకర్మకాండ నాకేమీ తెలియదే! ఏపుణ్యాత్ముడయినా వచ్చి, ఆకార్యరహస్యమును నాచెవిలో ఉపదేశంచేసి పోరాదూ?

అని ధర్మారావొకనాడు వీధరుగుమీద తాపీగాకూచుని అనుకొంటూవుండగా వైద్యుడు గురులింగం ఆదారంటపోతూ—

ఏమండోయ్! ధర్మారావుగారూ! బహుతాపీగాకూర్చున్నారేం?

అని పరామర్శించాడు.

రావయ్యా! రా! ఒక్కసారివచ్చి కూర్చో—నీతోపనివుంది.

నాతోపనాఅండి? ఏమిటదీ?

అంటూ గురులింగమొచ్చి ధర్మారావుగారి అరుగుమీద కూర్చున్నాడు.

నువ్వువైద్యం చేస్తున్నావు. అనేకరకములయిన వైద్యగ్రంథాలు చదివివుంటావు.

ఆ! చదివానండి—పుట్టినప్పటినుంచీ అదేగా వృత్తి.

"అటువంటిసందర్భంలో నీకనేకములయిన చిట్కాలు — యోగాలూ తెలిసివుంటాయి."

"తెలియకేం. అమోఘమయినచిట్కాలు తెలుసు—బ్రహ్మాండమయిన యోగాలుచేస్తా."

"ఏంచేస్తావో యేమోగాని, పనికొచ్చేదొక్కటిచెప్పు?"

"మీకేంగావాలీ?"

"బంగారంచేసేవిధానం నీకేమీ తెలియదుట య్యా!"

"సువర్ణయోగమాఅండి! హాహ్హాహ్హా!"

అని గురులింగం విరగబడి నవ్వుతుంటే, ధర్మారావు కేమీ అర్థమయిందిగాదు.

"ఎందుకయ్యా అలానవ్వుతావు?"

"మీకు సువర్ణయోగం కావాలంటే నవ్వొస్తూంది."

"ఏం?"

"మీకెందుకండీ! అల్లుడు శ్రీమంతుడు."

"అదేంమాటా? అల్లునిసిరి మనకెందుకొస్తుంది?"

"నిజంగా మీకటువంటి అభిప్రాయముందీఅంటే మూడునిమిషాల్లో మీచేత బంగారంచేయిస్తా."

"నిజం"

"అందుకింకాసందేహమాఅండి! మాటయందుగురివుంటేనే—"

"నువ్వింతగట్టిగా చెబుతుంటే యెందుకుండదూ?"

"కాదంటే, కొంచం పెట్టుబడి అవసరం."

"ఏమాత్రముండాలేమిటి?"

"చెప్తాగా—దానికంతావుంది."

"చెప్పిసెయ్యి—మనం రేపటినుంచీ పనిప్రారంభంచెయ్యాలి. చేసినబంగారాన్ని కళ్ళతోచూడాలి."

"గ్యారంటీగా బంగారమును తయారుచెయ్యగల పద్ధతివుంది."

"మరయితే నువ్వెప్పుడయినా చేశావా?"

"నేను చెయ్యడానికి ఒక ఆటంక మొచ్చిపోయింది. అసలు, మా నాయనగారు కనిపెట్టా రీసువర్ణ యోగం. వారు బంగారమునుతయారు చేశారుకూడా. అయితే రెండుమూడు పెద్దదెబ్బలుతిన్నారు. భార్య పోయింది. వారుకూడా పోయారు. సువర్ణయోగం అచ్చిరాలేదు. అందువల్ల వారు చనిపోతూ నాకేమని చెప్పారూఅంటే—

"ఒరేనాయనా! మనవంశానికి సువర్ణయోగం అచ్చిరాలేదు— బెడిసికొట్టింది. కాబట్టి నువ్వెన్నడూ ఆ ప్రయత్నమునుమాత్రం చేయొద్దు—కావాలంటే ఆయోగము నెవరికయినాచెప్పి చేయించు" అన్నారు.

"అందుచేత నేను స్వంతంగా ఆపనిచెయ్యదలుచుకోలేదు — విన్నారా!"

"అటువంటి బెడిసికొట్టడాలు—అచ్చిరాకపోవడాలూ నాకేమీ వుండవు—"

"కనుకనే మీచేత ఆ క్రియను చేయిస్తానంటూన్నాను."

"రేపు ప్రారంభం చేదామా?"

"చేదాంగానీ, ఈవిషయమును మీరెవరితోనూ చెప్ప కూడదు. చివరకు మీభార్యతోనయినా చెప్పకూడదు."

"చెప్పను—ఓకఅరవీసె బంగారం చెయ్యాలీఅంటే ఖర్చు ఏమాత్ర మవుతుంది?"

"వీసికయినా ఒక టేఖర్చు—అరవీసికయినా ఒక టేఖర్చు—"

"ఏమాత్రం."

"అరపవును యింగిలీకం—ఇరవైతులాలు వెండి—ఒక వెయ్యి పిడకలు—ఒకవంద నిమ్మకాయలు—ఒకవీసెడు బాదంపప్పు—ఇవన్నీ బజారులోనే దొరుకుతాయిగానీ—"

"ఇంకేమిటీ?"

"తెల్లకాకికాళ్ళు—"

"తెల్ల కాకి—"

"ఆ! అదొక్కటే కొంచంచిక్కు"

"అసలు తెల్లటికాకు లెక్కడయినా వుంటాయా?"

"వుండ కేం? హిమాలయపర్వత ప్రాంతాలలో వుండేవట పూర్వం"

"అక్కడయినా యిప్పుడు లేవన్నమాట?"

" ఇప్పుడు లేవు. "

"మరెలా"

"అప్పుడే—కొందరా తెల్లటికాకులను తీసుకొచ్చి, లేహ్యంగా వాండి పెట్టుకొన్నారు.'

"అల్లాగా! అటువంటివాళ్ళు మీరెవరన్నైనా ఎరుగుదురా మరీ?'

'ఆ! ఒకడు నాస్నేహితుడున్నాడు వాడికో ఏబైరూపాయలు పారేశామంటే—పని జరిగిపోతుంది"

"లేకపోతే యింకోపని చెయ్యకూడదూ? మామూలు నల్లకాకి నొకదానిని పట్టుకొని, దానికి తెల్లరంగు వేస్తే ఏమవుతుంది."

'లాభంలేదు. పుట్టుకనుంచీ తెల్లగా వుండాలి."

'సరే అయితే. మీరా లేహ్యంకోసం ప్రయత్నం చేయండి.'

మీకీలోపుగానే నేను తెచ్చిన సామానులన్నింటినీ బజారు నుంచి తెప్పించి సిద్ధంగా వుంచండి.'

"వుంచుతా. ఒకవీసెడు బంగారానిక్కూడా ఎప్టిమేసను."

'అవును'

'బాగుంది—చేయించండి! మీరుచెప్పిన సామానులన్నీ నేనీ సాయంకాలమే తెప్పించి సిద్ధంగా వుంచుతా."

అని ధర్మాగారు చెప్పిన అనంతరం మప్పటికి గంగాలింగం వెళ్ళిపోయాడు.

## ౨

'మనయింట్లో అద్దెకుండి, మనకే ఎసర్లు పెడుతున్నాడండోయ్. ధర్మారావుగారల్లుడు!'

'పెడుతున్నాడూ! పెట్టడూమరి? ధనమదం!'

'వాడికిడబ్బుంటే యెవరికి? వాడేతింటాడు — వాడేచుట్టుకుంటాడు. మనకేమయినావస్తుందా? వైద్యుడు గురులింగంగారిల్లెక్కడండీ— అంటూ యెవరో వెదుక్కుంటూ వచ్చారండీ.'

'ఉఁ! మందుకోసంగాబోలు! వస్తే ఏమయిందీ?'

'ఎవరోగొప్పవాడు—క్షయవుందనీ మీదగ్గర ఔషధంపుచ్చుకుంటామనీ వచ్చారు. మనకు వందో రెండువందలోవచ్చేవి — అతడు నిష్కారణంగా పాడుజేశాడు.'

'ఏమన్నాడూ?'

'వాళ్లొచ్చేటప్పటికి చక్రధర్ గుమ్మంలోనే వున్నాడు. గురులింగంగారిల్లు ఇదేనండీఅనిచెప్పాడు.'

'అంతవరకూ బాగానేవుంది.'

'చక్రధర్ ఆవచ్చినపెద్దమనిషికి ముఖపరిచయమున్నవాడయినాడు. అందువల్ల కొంపమునిగింది—'

'మీరిక్కడవుంటున్నారాయేమిటండీ—' అంటూ ఆపెద్దమనిషి లోపలకెళ్ళి చక్రధర్రావుగారికుర్చీలో కూర్చున్నాడు.'

'మరేనండీ! ఓసంవత్సరంనుంచి యిక్కడేవుంటున్నాను.'

'అదేం! పొలాలూయిళ్ళూవున్న దుగ్గాడవొదిలేసి యిక్కడ ఎందుకుంటున్నారు?'

'మాయావిడ ఆపల్లెటూళ్లో వుండలేనందండి. పైగా మాఅత్తవారిదికూడా యీపూరు. దుగ్గాడ యిక్కడికి దగ్గా అయినాను యిళ్ళు,

దగ్గరగావుందిగదా. పోనీ సైకిలుమీద రోజూఒకసారి పోయివస్తూవుం డొచ్చునని యీవూళ్ళో కాపరంపెట్టాను.'

'ఓహో! బాగావుంది. మీఅత్తవారిదికూడా యీవూరం టున్నారు. ఎంతసేపూ? గట్టిగా బారెడుదూరముంది దుగ్గాడ! మీ రిక్కడేవుండడం బావుంది. అయితే మీరిగురులింగంగారింట్లో అద్దె కుంటున్నారన్నమాట?'

'మరేనండి మామామగారికయినా యీవూళ్లో స్వంతయిల్లు లేదు. అద్దెకున్నదయినా బహుయిరుకు.'

'అవునులెండి—ఒకరోజు—రెండురోజులూఅయితే ఎలాగయినా సర్దుకోవచ్చు—ఈయింటికేమిస్తున్నారు'

'ఇదివరకెవరోవుండి—ఎనిమిదిరూపాయ లిచ్చేవారు. నాముఖం చూడగానే పదిహేనుకుతక్కువ ఈయననాడు గురులింగం.'

'ఔను. మీరిచ్చుకోగలసమర్థులు.'

'ముఖ్యంగా మాఅత్తవారింటికి దగ్గరలోవుంది — అందుకని—'

'హంగుగాకూడావుందిలెండి!'

నేను వారిమాటలన్నీ వింటూనే వున్నాను. మీకోసమొచ్చిన ఆపెద్దమనిషికి చక్రధర్‌తో ఆబాతాఖానీ యంతామెందుకు చెప్పండి.'

'తెలిసినవాడుగాబట్టి కుశలప్రశ్నలడిగాడు—తప్పేముందిలే—'

'అంతటితోఅయిందాఖరి?'

'నాకువంట్లో క్షయప్రవేశించింది. ఈగురులింగ మేమైనా పని చేస్తాడేమోనని వచ్చాను—'

అని ఆవచ్చినపెద్దమనిషి తిరిగిఅన్నాడు. అప్పుడు చక్రధర్ —

'అబ్బే! అటువంటివాటికీయన ఏంచేయగలడూ? లాభంలేదు. ఎవరయినా పెద్దవైద్యుణ్ణిచూడండి అన్నాడు.

'రెండొందలుఖర్చయినా వెనుదియ్యను. మీరుచెప్పినట్లు కొం చంఘట్టివాణ్ణిచూసుకోవాలి, నాకీవూరుకొత్తండీ! ఎవర్నీ తెలియదు.'

'అలాగయితే సాయంకాలంరండి! నారాయణరావని నాకు తెలిసిన పెద్దడాక్టరున్నాడు. అతడు లండనుపోయివచ్చాడు—దిట్ట మయినచెయ్యి.'

'ఆఁ! అవునండోయ్! ఆపేరు నేనూవిన్నాను—చాలామందిచెప్పు కుంటారు. పెద్దడాక్టరు. నేను ఆటువంటివాళ్ళచేతుల్లో నేపడాలి—నన్నా యనకు వప్పగించారంటే చాలాఉపకారం చేసినవారవుతారు.'

'వప్పగించడమేగాదు—గట్టిగాచెబుతాను. ముందురాగిపయిసా పుచ్చుకోడు. కొంతకాలం మందువాడాక, గుణం కనుపించినతరువాత కొంత—పూరాగా నయమయినాక మరికొంత.

'అవును—సరసంగావుంది — నన్నుసాయంకాలం రమ్మన్నారా?'

'రండి—'

'మీావుపకారం మరచిపోనండి.'

'ఆఁ! దానికేముందలెండి.'

అని ఆపెద్దమనిషి మనగుమ్మంవయిపయినా చూడకుండా చక్కాటోయాడు. నేనంతాకని పెడుతూ నేవున్నాను.'

అని భార్యగంగమ్మచెప్పినమాటలన్నీ వినేటప్పటికి గురులింగా నికి ఒళ్లుమండిపోయింది.

'ఆఁ! ఎంతపనిచేశాడు చక్రధరావూ? నాయింట్లోవుంటూ నా నోట్లోనేమట్టికొట్టడమా?'

'రెండువందలరూపాయిలూవచ్చేవి — నిష్కారణంగా చెడ గొట్టాడు.'

'నాకువైద్యంచేతనవునో—చేతగాదో వాడికితెలుసా! నారాయణ రావు నాకంటే ఏమంతగొప్పడాక్టరు? లండనువెళ్ళిరాగానే అయి పోయిందా?'

'అయినా తనకెందుకండీ! మనయింటికి మనకోసమొచ్చిన పెద్ద మనిషితో తనెందుకండీమాటలాడడం—'

'మాటలాడితేమార్లాడుకోనియ్యి—నాకు చేతగాదని చెప్పడమెందుకూ బుద్ధితక్కువమనిషి.'

'మనం తనదగ్గర పదిహేనురూపాయలు అద్దెపుచ్చుకుంటున్నామని అక్కసు—'

'పదిహేనుగాదు—ఇరవై పుచ్చుకుంటున్నాము—తనకు ఇష్టమై ఇచ్చుకుంటున్నప్పుడు, యీయేడుపంతా యెందుకు?'

'పెళ్ళాం పూర్ణకూడా మొగుడుకు తగినదేనండోయ్! తాము కూడా మసులుతూవున్నప్పుడు—వీధిపాచి వారుకూడా చెయ్యాలావొద్దా!'

'చెయ్యడంలేదా?'

'శ్రీమంతులుగా, వారిమాటేచెల్లాలి—యిదివరకావాటాలో ఎవరున్నప్పటికీ నెలకు పదిహేనురోజులపాచి వారు చేసేవారు—పది రోజులు మనం చేసుకొనేవాళ్ళం.'

'అవును—'

'ఆపాచితో తమకు నిమిత్తంలేదంటుంది—ఆదిలో మనం చెప్పలేదుట—'

'ఓహో! అలాపనికిరాదనిచెప్పు—పాచిచేసితీరాలని—చెప్పు—'

'చెబితే నామాట లక్ష్యంటండీ! మెడనిండా బంగారపు ఆభరణాలుపెట్టుకున్న శ్రీమంతురాలుగాదూ! అందుకని ఆవిడకు గోరోజనం చాలా జాస్తీ. ఇంకోవిషయమేమిటీఅంటే, దొడ్లో మనంకట్టుకున్న థణ్ణెంమీదికిపట్టుకొచ్చి తనగుడ్డ లారవేయిస్తుంది.'

'అదేంపనీ?'

'దొబ్బుడాయి. ఇద్దరుముగ్గురు నౌఖర్లున్నారు. వాళ్ళచేత కాస్తంత పాచి చేయించడానికి వల్లకాదుగానీ, మనదణ్ణెంమీద బట్టలారేసుకోవాలి.'

'అలా పనికిరాదని చెప్పలేకపోయావూ?'

'చెప్పడంలోనూ గట్టిగాచెప్పారా—ఇప్పుడు వేరేయింటో దణ్ణం కట్టుకుని దానిమీద గుడ్డలారేసు కొంటూంది.'

'పాచిసంగతికూడ గట్టిగా చెప్పు—'

'నిన్న మొగుడు వింటూవుండగానే చెప్పాను—ఏమనుకున్నారో ఏమో, ఈవేళనుంచీ తమమనిషిచేతనే చేయిస్తున్నారు పాచి—'

'సరి యిహానేం?—దారిలో పెట్టావుగా—'

'వొదిలిపెడతానా? చావగొట్టి చేయిస్తాను.

---

3

'ఏమిటండోయ్! పిడకలూగట్రాసిద్ధంచేయిస్తున్నారు. పురం పెట్టి ఏదయినా లేహ్యంతయారుచేయిస్తారాయేమిటి?'

అని లక్ష్మమ్మ అడగ్గా,

'ఆఁ! ఆఁ! అటువంటిదే.'

అని జవాబుచెప్పాడు ధర్మారావు.

'వంటిదే—అని సగంచెప్పి వూరుకుంటారేం? అదేమిటో సరిగ్గా చెప్పండి—నాతో చెబుతే తప్పులేదు. పడుచుదనం రావడానికాయేమిటి లేహ్యం.'

'నాకుఉన్నపడుచుదనం చాలదు టే!'

'మరయితే యెందుకూ లేహ్యం!'

'దానికంతావుంది—చెబుతాగా!'

'ఆ వైద్యుడు గురులింగం దొంగముండాకొడుకుసుమండీ — లేహ్యము—పుతాలు అని డబ్బుదొబ్బుతాడు.'

'నేనంత తెలివితక్కువవాణ్ణంటావా?'

'ఏమో—నాకు తెలియదుగాని, వ్యవహారంమాత్రం జాగ్రత్తగా చేసుకోండి—'

గురులింగమూమీరూ ఈమధ్య మహాగుసగుసలాడుతున్నారు.'

'నాజాగ్రత్తలో నేనుంటాను. మరేమీభయంలేదు.'

అని భార్యాభర్తలిద్దరూ మాటలాడుకొంటూవుండగా—

'ధర్మారావుగారూ!'

అని గురులింగం బయటనుంచి కేకవేశాడు. ధర్మారావు గబ గబా వాకిట్లోకెళ్ళాడు.

అరుగుమీద కూర్చుంటే, భార్య మాటలువింటుందని, చేరువలోవున్న 'తూం' మీదకి తీసుకుపోయి గురులింగంతో మాటలాడడం మొదలుపెట్టాడుధర్మారావు.

'నువ్వుచెప్పినసామానులన్నీ తెచ్చి సిద్ధంగావుంచానయ్యా! ఇహ నీదే ఆలస్యం.'

'నాఆలస్యం అసలేవుండదు.'

'తెల్లకాకిలేహ్యం సంపాదించావామరి?'

'మాన్నానూ! ఈవేళవెళ్ళాను వాడిదగ్గరకు.'

'వుందా?'

'వుంది—'

'పట్టుకొచ్చావా?'

'పట్టుకురావడానికీ, కొంచెంబెట్టుసరిచేస్తున్నాడు.'

'ఏమంటాడు?'

'వందరూపాయలియ్యమంటున్నాడు.'

'వందరూపాయలే!'

'అయితేఏం? మనకు వీసెడుబంగారం తయారవుతుంది.'

'అయితే వందరూపాయలూ ఇచ్చెయ్యిమరి.'

'ఏమయినా తగ్గుతాడేమోనని చూస్తున్నాను. మూడుపాతికల వరకూపెట్టాను.'

'సరే— యింకొక్క పాతిక్కే—నాగొడవ! వీసెడుబంగారం తయారయిందంటే, మనకటువంటిపాతిక లెన్నివస్తాయో!'

'పాతికలంటూ రేమిటి? వేలనండి!'

'పోతేపోయింది. వందరూపాయలూ యిచ్చి లేహ్యంపట్టుకురా!'

'పొద్దున్నే వస్తాను. వందరూపాయలూ సిద్ధంగావుంచండి.'

'ప్రస్తుతం నాదగ్గరడబ్బులేదే? ఆవందరూపాయలూ నువ్వే యిచ్చి తీసుకురా! బంగారం తయారయినాక చూసుకుందాం!'

'సరే— యిదిమరీబాగుంది. పూటబత్తెము—పుల్లెలుగా నేను సంపారించేస్తున్నాను. నిలుచున్నపళంగా నేనెక్కడ తేనూవందరూపాయలు. ఆమాత్రం సర్దుకోలేనప్పుడు మీరిటువంటిప్రయత్నంలోకి దిగకూడదు.'

అని గురులింగంచెప్పినమీదట ధర్మారావాలోచించాడు.

'ఇరవైతులాలువెండి, బాదంపప్పు — వగైరాసామానులకు చాలా ఖర్చయింది. ఇంతవరకూవచ్చాక నాదిలివదిలితే యెలాగ? తల తాకట్టుపెట్టియినా యింకోవందరూపాయలు తెచ్చానంటే వీసెడు బంగారం తయారవుతుంది.

ఆనక మరోవీసెడు! నాదరిద్రం శాశ్వతంగా వదలిపోతుంది. ఈసమయంలోగనక వెనక్కునేశానంటే — పెట్టినడబ్బు వృథాఅవుతుంది. ఆడదానికి తెలియకుండా పెట్టెలోవున్న పుస్తెలతాడుకాస్తా తాకట్టుపెట్టాను. దానిమీదనే మరోవందరూపాయలు తీసుకురావాలి.'

అని ధర్మారావు తనలో అనుకొంటూవుండగా—

'వెధవవందరూపాయలకింతగా ఆలోచిస్తారేమిటండీ! మీఅల్లుడి నడుగుతే యిస్తాడు. కొండతలకింద పెట్టుకొని రాళ్లకోసం వెదుక్కోవడమేమిటీ! అల్లుడిదాకాఅవసరంలేదు. మీఅమ్మాయినడిగినా యిస్తుంది.'

'అల్లుడూ అమ్మాయి, ఈయడమూ మేంపుచ్చుకోవడమూ—చాలా పార్లయింది. పుచ్చుకున్నది మళ్ళీ ఈయడంపద్ధతి లేకపోవడంవల్ల ఓమాటు మాఅమ్మాయి కొంచెంకష్టంగా మాటలాడింది. అప్పటినుంచీ ప్రాణంపోయినా సరే, వాళ్ళవడక్కూడదని ఒట్టుపెట్టుకున్నా.'

'మరయితే యెల్లా?'

'అగ్గిపోతుందా యేమిటి? ఏదో చేస్తాలే!'

'నేను రేపుఉదయంరానా?'

'రా! వందరూపాయలూ సిద్ధంచేస్తా—'

అని చెప్పి ధర్మారావు గురులింగాన్ని సాగనంపి, తాను తిరిగి లోపలకొచ్చాడు.

'మళ్ళీ వొచ్చాడు గురులింగం!'

అని భార్యఅన్నదానికి ధర్మారావేమీ జవాబుచెప్పలేదు.

'నేను వింటూనవిగాబోలు, తూముమీదకిపోయి, గుసగుస లాడుతున్నారు.'

"ఇస్! గుసగుస లేమీ వుండవే'

'ఏదోమంత్రాంగంచేస్తున్నారు, నాకెందుకులెండి—'

'మంత్రాంగమేమీ లేదు. వేశానో వెర్రప్పాను. అప్పుడే చెప్పను.'

'పోనీ చెప్పకపోతే!

'కొద్దిరోజుల్లోనే—అవసరంలేదు. కొద్దిపూటల్లోనే మనంలక్ష్మాధికారులమై పోవడానికి సమయం కనిపెట్టుకుంది.'

'ఓయమ్మో! ఇటువంటిమాటలు చాలాకాలంనుంచి చెబుతున్నారు.'

'ఇదివరకు చెప్పడం వేరు—ఇప్పుడు చెప్పడం వేరు—'

'ఏమిటీ ఆధైర్యం?

'రెండురోజులాగావంటే నీకే తెలుస్తుంది. ఇప్పుడు నేనింక ఒక్క అక్షరమైనా చెప్పను—'

ఇంతలో పూర్ణ, ఒకగిన్నెనిండా ఏమిటోపట్టుకొని, తల్లిగారింటి కొచ్చింది.

'ఏమిటమ్మా తెచ్చావు?'

అని తల్లి అడగ్గా—

'వంటవాడిచేత గారెలు చేయించానమ్మా. నాన్నగారుకూడా యింటిదగ్గర లేవున్నారు. తినండి.'

అంటూ పూర్ణ గారెలగిన్నెను ముందు పెట్టింది. తలిదండ్రు లిద్దరూ వాటిని తింటూవుండగా పూర్ణ దగ్గర కూచుంది.

'మేముచేసి నీకు పెట్టవలసింది లేదుసరిగదా, నువ్వు తీసుకు రావడమేమిటమ్మా యివన్నీ.'

అని తల్లి అంది.

'ఆఁ! దానికేముందిలేవే! ఇంట్లో వంటవాడున్నాడుగాబట్టి, అక్కడ ఏంచేయించడానికైనా వీలుంది.'

'గంగమ్మ ఏమంటుంది?'

'ఏమంటుందీ! దానితో చచ్చిపోతున్నాను. ఏపోరు లేకపోయినా, దానిపోరెక్కువగావుంది.'

'ఏమంటుంది?'

'పాచిదగ్గర పేచీ— నీళ్ళదగ్గర పేచీ — అన్నింటికీ పేచీ — దానితో గొడవెందుకని, అది చెప్పినట్లుగానే చేస్తున్నాను.'

'ఇంకెందుకూ?'

'వాళ్ళయింట్లోనుంచివచ్చే కుళ్ళునీళ్ళకాలవ, మన యింటి ముందుకు ప్రవహిస్తూవుంటుంది వైతరిణీలాగ? నిత్యమూ నేనాకాలవ కడిగించాలిట! మననీళ్ళవాడకం ఒకచుక్కయినా ఆకాలవలో పడనే పడదు. అయినప్పటికీ, ఆముండతో పేచీమనకెందుకని, ఆకాలవ కడగవలసిందని నౌఖరుతో చెప్పాను—

'వాళ్ళయింట్లోనుంచివచ్చిన కుళ్ళాయినీళ్ళన్నీ కడగవలసిన అవసరం మనకేముందండీ! నౌఖరీఅయినా మానుకుంటాగాని, ఆకాలవ నేను కడగను—'

అని నాఖరుముండా వాడు స్పష్టంగా చెప్పేశాడు. ఇహా నేను చీపురుపట్టుకొని బయలుదేరాలి, ఇంటివారికుళ్లుకడగడానికి.'

'బాగానేవుంది.'

'యీవిషయం మీఅల్లుడిగారితో చెప్పాను. వాళ్ళు చచ్చినా సరే—ఆకాలవ కడగవలసిన అవసరం మనకులేదు — నువ్వుమాత్రం మెదలకుండావూరుకో!'

అని మీఅల్లుడుగారన్నారు.

'అవును—వాళ్ళకుళ్ళు మీరెందుకు కడగాలే — గురులింగ మేమంటాడు?'

'వాడుమాట్లాడడు గంగమ్మ నానాసణుగుళ్ళూ సణుగుతుంది—'

'సణుగ్కోనియ్యి, నోరునొప్పిపెట్టి అదేవూరుకుంటుంది.'

'అలాగే మొండికెత్తివూరుకుంటున్నాను—'

'అంతే—'

'కొద్దిరోజులు అదయినా, కొన్నస్థలం వుండనేవుంది. ఆస్థలంలో ఓమేడకట్టించిపారేయమని చెప్పాను మీఅల్లుడుగారితో. ప్లాను వేయించారు. వచ్చేనెలలో పనిప్రారంభం చేయిస్తారు.'

'ఈవూళ్లో మీకుమేడ ఎందుకరా?!'

'ఈఅద్దెకొంపల్లో ఎవరుఅవస్థలుపడగలరమ్మా! ఉన్నంతకాల ముంటాము. ఆతరువాత మీరయినావుంటారు.'

అని కూతురుచెప్పగా—

'మీరుకట్టించినమేడలో వుండడానికి మాంఖర్మమేంకాలింది? నేనూ కట్టిస్తానో బ్రహాండమయినమేడ!'

అన్నాడుధర్మారావు.

'ఓమరీమంచిది—కానియ్యినాన్నా!'

అందికూతురు నవ్వుతూ—

భార్యలక్ష్మమ్మమాత్రం భర్తఅన్నదానికోమాటు మూతివిరుచు కుంది.

## ౪

'తిన్నయింటికే వాసాలు లెక్కపెడతారు కొందరు దుర్మార్గులు-'
అంటూ ప్రారంభించా డొకనాడు గురులింగం దొడ్లో కూచుని.

'కలికాలమండీ! ఇంట్లో అద్దెలకుంటూ, ఇంటివాళ్ళకే ఎసర్లు పెట్టడం!'

అని వెంటనే గంగమ్మ అందుకుంది.

'రెండువందలరూపాయలొచ్చే కేసు నిష్కారణంగా పోయింది.'

'పోనీలెండి—వాళ్ళకు మనవుసురు తప్పకుండా తగులుతుంది.'

'నా యింటికి, నాకోసమొచ్చిన పెద్దమనిషితో గుసగుసలాడవలసినఅవసరం ఆతుంటరికేం కలిగిందో!'

'దుర్బుద్ధి.'

'నాకంటె పెద్దవైద్యుడు, మొగాడూ యీవూళ్లో ఎవడున్నాడంట?'

'లండనునుంచివచ్చాడుగా?'

'అయిపోయింది లండనునుంచివస్తే.'

'అందుకనేగా? మనకొచ్చిన కేసు చెడగొట్టి, అక్కడికి తీసుకెళ్లడం!'

'కానియ్యి—ఇంతమాత్రంలో మనకుపోయిందేమీ లేదు. కబుర్లు చూస్తే పెద్దవి — మనకుళ్ళు కాలవ కడిగించడానికి తాహతు లేదు—'

'గతిలేదనండి—'

'ఛీ! వెధవబ్రతుకు?'

'తూ పాడుబ్రతుకు.'

'పౌరుషం లేదు.'

'ఒంట్లో రక్తం లేదు—'

'శ్రీమంతులమని చెప్పుకోవడం!'

'మెడనిండా ఆభరణాలు దిగేసుకుంటేఅయిందా! యింటిముందు కుళ్ళుకాలన కడిగించుకోలేని యిల్లాలు.'

అని మొగుడ్నోకనయిపు పెళ్ళామొకనయిపున అంటున్నమాట లన్నింటినీ విందిపూర్ణ, ఆమెభర్త చక్రధర్ కూడా వింటూనేవున్నాడు. ఆమాటలన్నీఏమిటని అడగాలనుకుంటున్నాడు. ఇంతలో పూర్ణ భర్త దగ్గరకొచ్చి—

'మనకేమిటండీ, నిత్యమూ యీగోల — మరోకొంపయినా చూడండిపోదాం. వింటున్నారుగా? ఒకమాటగాదు, ఒకపలుకుగాదు, ఎలాగాభరించడం?'

అనిచెప్పేటప్పటికి, చక్రధర్ కు మరింతఉద్రేకం కలిగింది. కాలి బూటునుపట్టుకొని గబగబదొడ్లో కెళ్ళాడు.

'ఏమిర్రాగాడిదీ ఆపేలాపన—యిందాకటినుంచి పేలుతున్నావు. ఎందుకెందుకని ఓపికపట్టినకొద్దీ ఆడముండతో ఏకమై మరీపేలు తున్నావు—'

అంటూ ఆలెంపమీదఒకటి, యీలెంపమీదఒకటి, రెండు జోడుదెబ్బలు బలంగా తగిలించేటప్పటికి—గంగమ్మ—

'బాబోయ్! రండరోయ్! రండరోయ్! మాయింట్లో అద్దె కుండి, మమ్మల్నికొట్టిచంపేస్తున్నాడరోయ్!'

అని వీధినిబడి రంకెలేయడం మొదలుపెట్టింది.

ఇరుగుపొరుగునున్న పదిమందీమూగారు. విషయమునంతటినీ తెలుసుకున్నాక—

'ఏదిఏమయినా మీరుచెయ్యిచేసుకోవడం తప్పండీ!'

అనికొందరు—

'ఎవరికయితేమాత్రం ఎంతవరకూ వుంటుందండీఓపిక, ఈ యింట్లో కాపరమున్నవాళ్ళనందర్నీ యిలాగేబాధపెడతారు — వీళ్ళకు కావలసిందే!'

అని మరికొందరు—

'ఇష్టంలేకపోతే ఇల్లుఖాళీచేసి మరో ఇంట్లోకి లేచిపోవాలి గాని—మీదపడి కొట్టడమేమిటి?'

అని యింకో కొందరు—

అని ఇలాగ్గా ఎవరికితోచినట్లువారు, నలుగురూ నాలుగు విధాలుగనూ సబబులు చెప్పారు.

చక్రధర్ ఎవరిమాటా వినిపించుకోకుండా లోపలకెళ్లిపోయాడు.

'చార్జియిస్తాను. దుంపతెంపి మాపంవేసేస్తాను. వెయ్యిరూపాయలు ఖర్చయినాసరే వీడిఅంతు కనుక్కుంటేగాని వొదిలిపెట్టను—'

అని గురులింగం ఇంకా యేమేమో అనడం మొదలుపెట్టడం వల్ల చక్రధర్ తిరిగి ఇవతలకొచ్చి—

'చార్జియిచ్చుకో – మరేమయినాచేసుకో చేతనయితే, అంతే గాని, అనవసరంగా నోరుపాడుజేసుకున్నావంటే మళ్ళీతగులుతాయి జోడుదెబ్బలు' అన్నాడు.

'అవునండీ! మాటలతో ఏంపనీ! వ్యవహారం చేసుకోండి.'

అని పెద్దమనుష్యులందరూ చెప్పడంవల్ల గురులింగం యిహ నోరెత్తకుండా లోపలికి చక్కాపోయాడు.

గంగమ్మ అతనితో మెల్లిగా గుసగుసలాడింది.

'చార్జియిస్తానంటూరేమండీ డబ్బుదండుగ! ప్లీడర్లుపిల్చి పిప్పి చేస్తారు.'

'మాటవరసకలాఅన్నాగానీ, నిజంగా చార్జియిస్తానాయేమిటి? డబ్బుదండుగని నాకుమాత్రం తెలియదూ?'

'బాగాచెప్పారు—కోర్టు లెక్కమంటే, ఎన్ని వందలయినా చాలవు.'

'వెధవజోడుదెబ్బలు—నాకు సరిగ్గా తగలనేలేదు—అందునుగురించి డబ్బు పాడుచేసుకుంటామా! చార్జియిస్తానని బెదిరిస్తే, చక్రధర, హడిలిపోయి, మనకో వందరూపాయలయినా యిచ్చి బ్రతిమాలుకుంటాడు.'

'అవునండోయ్! అదా మీఆలోచన!'

'మరేమిటనుకున్నావ్! నేనేమీ చేతగాని పిచ్చిపుల్లయ్యనుగాను వాడిదగ్గర డబ్బుచ్చుకుని, కష్టమరోవిధంగా తీర్చుకోవాలి.'

'ఆఁ! అదీ తెలివి. మెల్లిగా మాటలాడండి. వాళ్లువింటారు.'

'వాడి మామగారిదగ్గర బంగారంచేస్తానని, వందరూపాయలు రొఖ్ఖము వందరూపాయిలు సరుకులూ లాగేశానామరి?'

'లాగారులెండి! ఇప్పుడే చక్రధర్ దగ్గరకూడా ఏమైనాలాగాలి.'

'మాస్తానా! రేపటినుంచి, వాడు వింటూవుండగా, చార్జి యిచ్చాననీ—ప్లీడరుసలహాచేశాననీ—పోలీసులొస్తారని — యింటికిరాగానే యిటువంటికబుర్లు చెబుతుంటాను వాడువినేలాగ. నువ్వుకూడా తగినట్లుగా తాళంవేస్తూండు. వాడిదగ్గర డబ్బురానపుడు నేనుచూస్తాను. డబ్బియ్యడమేగాకుండా, కాళ్ళుపట్టుకుంటాడు.'

'అదే—అదే—అలాగే జరగాలి. అంతేగాని, నిజంగా చార్జి యిచ్చేరుసుమండీ!'

'ఆఁ! నేనటువంటి తెలివితక్కువపని ఎప్పుడూచెయ్యను!'

అని ఆభార్యాభర్తలు రహస్యంగా మాటలాడుకొంటున్న సమయంలో ధర్మారావు వారింటికొచ్చి—

'ఏమండోయ్! గురులింగంగారూ.'

అనిపిలవడంవల్ల, గురులింగం వెంటనే యివతలకొచ్చి—

'మాఅల్లుడూమీరూ ఏదోగొడవ పడ్డారుట!'

అని అడిగాడు.

'ఎందుకులెండి! వెడుతున్నానుగా చార్జి ఈయడానికి—ఏమే కండువా యిలాపడెయ్యి—ప్లీడరుదగ్గర కెళ్ళాలి.

అని గురులింగం హడావిడిగా బయలుదేరుతుండగా, గంగమ్మ కండువాపట్టుకొచ్చి భర్తకిచ్చి—

'అయిదొందలయినాసరే—చార్జీ ఈయడం మానొద్దు. కొనవరకూచూడండి—కావలసినంతమంది సాక్షులున్నారు—ఇంతదారుణమా! ఇంతదారుణమా! వెళ్ళండి—త్వరగా వెళ్ళండి ఎవరెన్ని చెప్పినాసరే—చార్జీయిచ్చి మరీరండి యింటికి.'

అని భర్తను హెచ్చరించింది. గురులింగం ధర్మారావుతో మాట్లాడ్డానికయినా సావకాశం లేనివాడిలాగ గబగబా వెళ్ళిపోతుండగా

'ఆగవయ్యా! ఏమిటి తొందర?'

అంటూ ధర్మారావతని చెయ్యిపట్టుకొని—

'ఇలారా! నీతో పనివుంది.'

అంటూ కొంచందూరంగా తీసుకెళ్ళి—

'నాముఖమయినా చూస్తావా లేదా?'

అని అడిగాడు.

'ఎవరిముఖమూ చూడవలసిన అవసరంలేదు. మీకు ఎంత అల్లుడయితేమాత్రం జోడుదెబ్బలుకొడితే పడమన్నారుటండీ!'

'ఏదోఅయిపోయిందిగా?'

'అయిదొందలు ఖర్చయినాసరేనండీ, నేను చార్జీ ఈయక మానను.'

'నేను మాఅల్లుణ్ణి కూకలేశా లేవయ్యా!'

'నోటిమాటలేగా? నాకు తగిలిన దెబ్బలో—'

'అపరాధంకింద ఓవందరూపాయ లిప్పిస్తావుగాక!'

'వెధవవందరూపాయలు నాకెందుకండీ! జోడుదెబ్బలు తిన్నందుకు కక్షతీర్చుకు తీరుతా!'

'కక్షలు పెంచుకున్నందువల్ల ఏమిటయ్యా ప్రయోజనం? బంగారంచేయిస్తానని నాచేత రెండువందలు పాడుచేయించావు.'

'నేనేమయినా తిన్నానా? అవతలముండాకొడుకు దగాచేస్తే నేనేంచెయ్యను.'

'ఏముండాకొడుకు దగాచేశాడో, నాకు తెలుసా.'

'తెల్లకాకిలేహ్యామిస్తానని, వందరూపాయలూ పుచ్చుకుని, యీ రోజువరకూ యింకా తిప్పుతున్నాడు—మీరిచ్చిన సామానులన్నింటి తోనూ మిగతాపనియావత్తూచేసి సిద్ధంగావుంచా మాయింట్లో.'

ఏమో—నాకిక ఆశలేదు. నాడబ్బు రాదు—పోయింది. ఎవరితో నయినా చెప్పుకొంటే నవ్వుతారని, నోరుమూసుకుని వూరుకున్నాను—దానికేంగాని, నువ్వనవసరంగా కచ్చేరీకెక్కొద్దు—మాఅల్లుడితో చెప్పి, నీకేమయినాయిప్పిస్తా వూరుకో!'

'అబ్బే! అటువంటిమాటలు చెప్పకండి. వెధవ వందరూపాయలు.'

'మరోపాతిక—'

'లాభంలేదు—'

అని గురులింగం యిహఅక్కడ నిలుచోకుండా వడివడిగా పోయాడు.

౨

'ఏమే! పోలీసులొచ్చారా, యింకాలేదా?'

అని, గురులింగం యింటికొచ్చి రావడంతోనే, చక్రధర్రావు వినేలాగ, భార్యనడిగాడు.

'పోలీసు లేమిటండోయ్!'

అని ఆమె ఏమీ తెలియనట్లు, భర్తకు కన్నుగీటుతూ అడిగింది.

'చార్జి యిచ్చావా? సమను పట్టుకొస్తారు పోలీసులు—'

'ఇచ్చారూ చార్జి, మంచిపనిచేశారు.'

'వొదిలిపెడతానా! ఈసందర్భములో యెంతదూరమయినా వెళ్ళదలుచుకున్నాను.'

'వెళ్ళాలిసిందే!'

'కాస్సేపటికో—కూస్సేపటికో వస్తారుపోలీసులు. చెప్పుదెబ్బ కొట్టినవానికి జైలుపడుతుందని చెప్పాడుప్లీడరు.'

'కానియ్యండి—అంతపనీఅయినప్పుడుగాని తెలీదుఅబ్బాయిగారికి.'

అని యివతలగదిలోని భార్యాభర్తలు మాట్లాడుకొనేమాటలవతలగదిలోని భార్యాభర్తలకు వినిపించాయి. వినిపించాలనే గురులింగం అంతగట్టిగా మాటలాడుతూ — చార్జీఈయలేదని చేతులతో సౌంజ్ఞచేసి భార్యకుచెబుతూనేవున్నాడు.

పూర్ణ భర్తదగ్గర కెళ్ళి మెల్లిగా—

'ఈముండావాడేకో గడబిడచేస్తున్నాడండోయ్!'అంది.

'చెయ్యనియ్యి, నాకుమాత్రం చేతగాదూ? అయిదు వేలుఖర్చు పెడతాను.

అని చక్రధర్రావు పయికిఅన్నాడేగానీ—తనమీద నిజంగా చార్జీ మోపుచెయ్యబడితే చిక్కేనని లోపలభయపడుతున్నాడు.

'ఎందుకొచ్చినగొడవండీ! మనలాంటివాళ్ళం కచ్చేరికెక్కితే అప్రతిష్టకాదూ! మీరుకూడా ప్లీడరింటికెళ్ళి సలహాచేసినట్లున్నారు. ఏమన్నాడూ?'

'చేతితోకొట్టినదానికంటె, చెప్పుతోకొట్టడం ఎక్కువనేరమన్నాడు. సాక్ష్యంతేలిపోతేతప్ప లేకపోతే చిక్కేనన్నాడు.'

'చూశారామరి.'

'కానియ్యి—ఏమయితేఅవుతుంది.'

'అదేమిటండీ?'

'మరేంచెయ్యమంటావు! ఆవెధవకాళ్ళుపట్టుకొని బ్రతిమాలమన్నావాయేమిటి?

'ఓవందరూపాయలిస్తే వూరుకుంటాడేమో—'

'అలాగునని మీనాన్నగారిచేత యింతకుముందే చెప్పించాను.'

'వాడొప్పుకోలేదా?'

'చూశారా? వందరూపాయలిస్తామన్నా వాడూరుకోలేదు. పెద్దగొడవే చెయ్యదల్చుకున్నాడల్లేవుంది. మీరంతలోనే జోరుతో వాణ్ణి అలాకొట్టేస్తారనుకోలేదు సుమండీ! దొడ్లో కెళ్ళి నాలుగుచివాట్లు వేస్తారనుకొన్నాగానీ—అంతసాహసంచేస్తారనుకోలేదు.'

'తరువాత ఏమయితేఅయిందిగానీ, మాంబాగాకొట్టానువెధవని—వీధిలోవాళ్ళందరూ సంతోషిస్తున్నారు.'

'ఇప్పుడు మనసంగతిచూడండీ! కోర్టుచుట్టుతిరగాలి నవ్వే వాళ్ళకునవ్వసందు—దెప్పేవాళ్ళకు దెప్పసందు.'

ఇంతలో ధర్మారావక్కడికొచ్చి—

'ఏమరా?ఏమిటీకథ—?మళ్ళీఏమయినాగొడవపడుతున్నారేమో నని చూసిరమ్మనిపంపించింది మీయమ్మ'అన్నాడు.

'చార్జియిచ్చాడుటనాన్నా!'

'ఇచ్చాడూ?'

'కాన్సేపటికో కూస్సేపటికో పోలీసులు సమనుపట్టుకొస్తారుట!'

'వందరూపాయలిస్తామన్నా ఊరుకున్నాడుగాదే!'

'మీఅల్లుడిగారికి ప్లీడరుచెప్పాడుటనాన్నా, చేతితోకొట్టినదానికంటె చెప్పుతోకొట్టిన దెక్కువనేరమట!'

'అవును—శరీరానికి బాధకలిగించడము – అవమానంచెయ్యడమూ—రెండునేరాలున్నాయి.'

'మరోవందరూపాయలుపారేస్తే చార్జితీసేసుకుంటాడేమో అడగండీమామగారూ?'

'గాకపోయినా నువ్వుచాలా తొందరమనిషివోయ్!'

'ఏదో అయిపోయిందిగాదండీ!'

'రెండొందలూయిచ్చి చార్జితీసెయ్యమని చెప్పునాన్నా!'

'ఏమంటాడోచూస్తాను.'

'చూడడంగాదు. రెండొందలూ పట్టుకెళ్లి చేతిలో పెట్టు.'

'కాయితం రాయించుకోవాలి.'

'ఏమనీ?'

'చార్జీతీసెయ్యడానికి వాడొప్పుకున్నట్లు.'

'అవును—లేకపోతే డబ్బాపుచ్చుకుంటాడు.'

'చార్జీనడుపుతాడు.'

చక్రధర్రావు వెంటనే రెండువందలూ పట్టుకొచ్చి మామగారికిచ్చి—

'ఇప్పుడే వెళ్ళండి—యింట్లో వున్నాడు'

అని హెచ్చరించినమీదట ధర్మారావా డబ్బును జేబులో పెట్టికొని గురులింగమింటికెళ్ళి—

'ఏమయ్యోయ్!'

అనిపిలిచాడు. అప్పుడే పనిపట్టాడు గురులింగం.

'ఏమేవ్! మళ్ళీ మామగార్నిపంపాడు. ఏంచెయ్యను. మరో వంద రూపాయలు ఈయమనండి.'

'రెండువందలూయిస్తే ఒప్పుకోనా?'

'మాట్లాడకుండా ఒప్పుకోండి. మనం చార్జీ ఈయడం వాట్టిదని తెలుస్తే వ్యవహారం చెడిపోతుంది.'

అని భార్య చెప్పినమీదట గురులింగం తలుపుతీసుకుని యివతల కొచ్చాడు.

'ఎందుకండీ!'

'మా బెట్టుసరి చేస్తున్నావే!'

'బెట్టుసరీ లేదు—ఏమీ లేదు—ఇప్పుడుమళ్ళీ కోర్టుకుపోవాలి—'

'ఒక్క నిమిషమాగు—నీతోపనివుంది.'

అంటూ ధర్మారావతన్ని చెయ్యిపట్టుకొని కూచోబెట్టాడు.

'మీరనవసరంగా నాటయిమంతా పాడుచేస్తున్నారు—కచ్చేరీకి పోవాలి.'

'కచ్చేరీలూ చార్జీలూ నేనూయెరుగుదునయ్యోయ్! నువ్వు అనవసరంగా తిట్టినందుకు మాఅల్లుడుకూడా నీమీదచార్జీయిస్తున్నాడు. అతనికి పీధంతా సాక్ష్యం పలుకుతామంటున్నారు.'

అని ధర్మారావు చెప్పేటప్పటికి గురులింగానికి సగంబెట్టుసరి వచ్చింది. ఆమాటవిని — గంగమ్మకూడా యినతలకొచ్చింది. ఆమె గుండెల్లోకూడ రాయిపడింది.

'అనవసరంగా కచ్చేరీలకెక్కడమెందుకని వాడితోకూడా చెబుతున్నాను. ఇదిగాక ఈరెండువందలూ పుచ్చుకొని, నీచార్జీనువ్వు తీసేసుకో, మనకూమనకూ స్నేహంమామూలుగా వుంటుంది. నా మాటవినూ—లేకపోతే చెడిపోతావు. అల్లుడు డబ్బుగలవాడు—కక్షకట్టాడంటే పదివేలయినా ఖర్చుపెట్టి నీతుప్పదీస్తాడు. నామాటవిన్నావంటే ఏగొడవావుండదు.'

అని ధర్మారావు చెప్పినమాటలువిని—

'అబ్బో! లాభంలేదండీ—'

అంటూ గురులింగం భార్యవయిపు చూశాడు.

'బాబుగారింతగా బ్రతిమాలుతున్నప్పుడు మనంకాదనకూడదు—వారియిష్టప్రకారం కానియ్యండి—'

అని గంగమ్మ అంది.

'నీకు తెలీదు—నువ్వూరుకో.'

అని గురులింగం బెట్టుసరి విడవకుండా మాట్లాడాడు.

'ఏదోలెండి—ఆరెండువందలూ పుచ్చుకోండి. ధర్మారావుగారి ముఖంచూడాలి—'

అని గంగమ్మ తిరిగి సిఫార్సుచేసినమీదట తనకెంతమాత్రమూ యిష్టంలేనట్లుగానటిస్తూ ధర్మారావుగారు బలవంతంచేసి యిచ్చిన రెండువందలూ పుచ్చుకొని—

'మీరు మధ్యవర్తిగా రాకపోయినట్లయితే ఎంతయినా చేసే వాణ్ణి' అన్నాడు.

'బుద్ధిమంతులండి—చాలామంచివాడివి. మరి నువ్వెప్పుడో కాయితం రాసి ఈయాలి'

'ఏమని!

'చార్జిషీటు చెయ్యడానికి ఒప్పుకొన్నట్లు — ఉభయపార్టీలూ రాజీ పడ్డట్లు—'

అని ధర్మారావనగా గురులింగంతిరిగి భార్యముఖంలోకి చూశాడు.

'రాసియ్యండి—తప్పేముంది.'

అని గంగమ్మ చెప్పిన మీదట—

'సరే—ఆకాగితమేదో మీరే వ్రాయండి—సంతకం చేస్తాను.' అన్నాడుగురులింగం. అప్పుడు ధర్మారావు, కాగితమును కలమునూ తెచ్చి,నాలుగుపంక్తులురాసి గురులింగానికియ్యగా,అతడుభార్యవినేటట్లు దాని నిలాచదివాడు.

'మాయింట్లో అద్దెకుంటూవున్న చక్రధరరావుగారికి, యింటి యజమాని గురులింగంవ్రాసియిచ్చిన రాజీనామావుత్తరము

మనవుభయులమున్నూ ఘర్షణపడినందువల్ల, మీరు నన్ను రెండుచెప్పుదెబ్బలు కొట్టారు—అందువల్ల నాకు కలిగిన కష్టపరిహారం కింద మీదగ్గిర రెండువందలరూపాయలు పుచ్చుకుని చార్జివగైరా చర్యలేమీ లేకుండా రాజీపడడమయింది—'

అని చదివినమీదట—

'చెప్పుదెబ్బలవిషయంకూడా యిందులో యెందుకండీ?'

అని అడిగాడు గురులింగం

'అసలువిషయమదేగా? అదిలేకపోతే చార్జీవుండదు—యీరాత కోతలూవుండవు—'

అని ధర్మారావు చెప్పినమీదట

'మనకు పోయిందేమీ లేదు—సంతకం చెయ్యండి.'

అని గంగమ్మ చెప్పింది. అప్పుడా కాగితంమీాద సంతకంచేసి యిచ్చాడు గురులింగం.

'ఈమాత్రందానికి పెద్ద బ్రహ్మాండం చేశావు—'

అంటూ ధర్మారావు ఆ కాగితమును పట్టుకుని—అల్లుడిగారింట్లోకి వెళ్ళిపోయాడు.

'వెధవ చెప్పుదెబ్బలు రెండూ అనిమిషంలోనే పోయాయి. సునాయాసంగా రెండొందలూ మిగిలాయి. ప్రజ్ఞఅంటే మనదా, యింకొకరిదా?'

అని గురులింగ మనంతరం, భార్యతో సగర్వంగాఅనగా—

'బంగారంచేస్తానని ధర్మారావుగారిదగ్గర పుచ్చుకొన్నడబ్బు—యీాడబ్బూ పెట్టి ఓయకరం పొలంకొనండి—లేదా, కాసులుకొని పడెయ్యండి.' అంది గంగమ్మ.

'అలాగేచేస్తా—ఏదయినా యిలా కలిసిరావాలి.'

అని మానాభిమానాలులేని గురులింగం ఆనందమునుపొందాడు.

---

## ౬

బజారునుంచి కూరలుపట్టుకొని యింటికొచ్చాడోలేదో గురులింగం—అతనివెనకాలనే వచ్చిందొకఆడమనిషి—

'ఎన్నిపిలిచినా పలకనేపలకవేమయ్యా మారాజా! దారిపొడుగునా గొంతుకడిపోయింది.'

అని ఆమనిషి అనడంతోనే కూరలసంచిని లోపలపెట్టి యివతలకొచ్చాడుగురులింగం—అతనితోనే గంగమ్మ—

'ఏమిటదీ? ఎవరునువ్వూ?'

అని ఏమిా తెలియనట్లాతడు మాటలాడడంవల్ల ఆమనిషికి ఒళ్లు మండిపోయింది.

'అలామాట్లాడతావేమయ్యా? కూరలకు అగ్రహారపాయుయ్య కుండా వచ్చేశావు—ఎవరిబాబుసొమ్మా?'

'బుద్ధితక్కువమాటలు మాట్లాడకు నీకుకూరలకు డబ్బులియ్య లేదూ?'

'ఇచ్చావా?'

'నాలుగుబేడకాసులూ లెక్క పెట్టియిచ్చాను. నువ్వొపెట్టెలో వేసుకొని, దొంగను తరుముకొచ్చినట్లు తరుముకొచ్చావా? ఓహో!'

'ఎక్కడనేర్చుకున్నావయ్యా యిటువంటిబుద్ధులు—'

'ఛీ! నీకుడబ్బులిచ్చేశాను.'

'అగ్రహారపాయిడబ్బులంతోనూ నువ్వేచెయ్యనయ్యా పెద్దకాప రం—నేనుచెడిపోను.'

'అలాఅన్నావు బావుంది.'

'కూరలకు నువ్వు డబ్బులిచ్చావంటయ్యా? నేను బేరంలో వున్నాను. అదేసమయమని గబగబాపారిపోయొచ్చావు—'

'ఈస్వల్పంలో నాకబద్ధమాడవలసిన అవసరంలేదు. నీకు కూరలడబ్బు లప్పుడేయిచ్చేశాను.'

'చాలుచాల్లేనయ్యా! కడుపుకుతింటావు.'

అని కూరలమనిషి అంటూవుండగా—

గంగమ్మ ముందుకొచ్చి—

'ఇదిగోఅమ్మీ! మంచీచెడ్డా తెలుసుకొనిమాట్లాడు. మేమటు వంటిమనుషులంగాము. నీడబ్బులు మాకొక్కాటి కవసరంలేదు— వెళ్లు.'

అని భర్తను సమర్థించి మాట్లాడడం మొదలుపెట్టింది.

'చాలుచాల్లేవమ్మా! మా తెలిసినట్లు మొగుణ్ణి వెనకేసుకొస్తు న్నావు. ఇలాగ్గా ఎంతమందిని దగాచేసి బ్రతుకుతున్నారు.'

'అటువంటిబుద్ధితక్కువపేలావన పేలావంటె చార్జీఈయవలసి వుంటుంది.'

'చార్జీవాడ్దూ, గీర్జీవాడ్దుగానీ, నాకు డబ్బులిచ్చానని ప్రమాణం చెయ్యమనవమ్మానీ మొగుణ్ణి.'

అని ఆకూరలమ్మకొనేమనిషి అనగా—

'నాసత్యప్రమాణవూర్తిగా నీకుడబ్బులిచ్చేశాను. గాయిత్రిసాక్షి మాలక్ష్మితోడు—భగవంతునిసాక్షి. చాలా? యింకా ఏమయినాప్రమాణాలు చెయ్యమంటావా?

'ఓయబ్బో! కానిడబ్బుకోసం గడ్డితినే మారాజులుంటారు గామోసు! పోనిలేవయ్యా! జాందేవ్! నాడబ్బును ఎంతమంది తినడం లేదు, నాకుపుట్టినవాళ్ళు—అందులో నువ్వోడివి.'

'సరే—పో!'

అని భార్యాభర్తలిద్దరూ లోపలకెళ్ళి తలుపు వేసుకున్నారు.

'నాకూర లప్పనంగా పడేసుకొని తినకపోతే గడ్డితినరాదం టయ్యా! మట్టి తినరాదంటయ్యా! అగ్గరూపాయిడబ్బులికి ఎన్ని ప్రమాణాలుచేశావు — ఎన్నిసత్తాలుపలికావు—ఈపాలి నాకొట్టుకాడికిరా నాకొడకా!'

అని ఆ కూరలమ్మకునేది వీధివీదందరూ వినేలాగ నానా హం గామాచేసింది కాని గురులింగం తలుపుతియ్యలేదు. తిట్టుకుని, తిట్టుకుని ఆకూరలమ్మకొనేది వెళ్ళిపోయిన అనంతరం—

'నిజంగా దానికి డబ్బులియ్యలేదా యేమిటండీ?'

అని భర్తను మెల్లిగా అడిగింది గంగమ్మ—

'ఇది మొదటిసారిగాదు. ఇంతకుముందయిధారుసార్లు టోపీలా వేశాను ముండని. కాని అప్పుడు కానుకోలేకపోయింది. ఈవేళ పట్టుకుంది. వెంటబడింది.'

'అయితే అర్ధరూపాయి లాభమన్నమాటే—లిట్లు గాలికి పోయాయి.'

'ఆఁ! ఎవరు లెక్క చేస్తారు దానిటిట్లు?'

'దానినోటికిజడిసి, అర్ధరూపాయి ఇచ్చేస్తారేమో నను కున్నాను.'

'ఓయబ్బో! మనంగాదు అలా లెక్క చేసేది. వారంరోజులదాకా కూరలు నచ్చిపోతాయి. వెర్రిముండ అసలు విషయమునింకా కనుక్కో నే లేదు.

'అదేమిటి?'

'నాలుగురకాలకూరలూ, నాలుగుపీసెలు వేసుకొన్నాను. అరవీసెలనిచెబుతే నమ్మిందిముండ, నాలుగువీసెలకు నాలుగుపావలాలు రూపాయి.'

'అరవీసెలనుకుని అర్ధరూపాయుంటూంది.'

'ఎవరి తెగులెలాకుదర్చాలో నాకు బాగా తెలుసు.'

అని వారుమాటలాడుకొంటున్న సమయంలో ఎవరోతలుపు తట్టారు.

'ఆకూరలముండ మళ్ళీగా లేదుగదా!'

అని గంగమ్మ అడిగింది.

'ఎవరువారు—?'

అని గురులింగం తలుపు తియ్యకుండానే అడిగాడు.

'నేనండీ—విద్యున్నను.'

'విద్యున్నపంతులే! కాంగ్రెస్ వాలా! తనకేదో నాసాక్ష్యం కావాలంటూ తిరుగుతున్నాడు.'

'డబ్బియ్యకపోతే మాటలాడొద్దు.'

'నాకు తెలుసు.'

అంటూ తలుపుతీసుకొని ఇవతల కొచ్చాడు గురులింగం.

"ఓహో! వియ్యన్న పంతులుగారా! దేశోద్ధారకులు—దయ చెయ్యండి.'

అంటూఅతన్నిఆహ్వానించి చాప వేసికూచోబెట్టాడుగురులింగం.

'నేనుచెప్పిందేమాలోచించారు?'

'ఏవిషయం?'

'నాతరఫున మీరు కచ్చేరీలో ఓసాక్ష్యం చెప్పాలి. ఇదివరకు మనవిచేశా.'

'వ్యవహారమేమిటో నాకు గుర్తులేదండీ! నాసాక్ష్యం దేనికి?

'ప్రజల డబ్బును అపహరించి నేను మేడకట్టానని, కాంగ్రెస్ వారు నామీద కేసుపెట్టారు.'

'సరసంగానేవుంది. తప్పేముంది? యదార్థవిషయ మంతేగా?'

అని గురులింగ మన్నదానికి వియ్యన్న ఓచిరునవ్వు నవ్వి—

'మీరుకూడా అలా అంటే నేనేం చెప్పను?'

'సరే—తరువాత వ్యవహార మేమిటో చెప్పండి.'

'మీరా కేసులో నాతరఫున సాక్ష్యం చెప్పాలి.'

'అబద్ధం చెప్పడమంటే, నాకు ప్రాణపోతుంది. యదార్థం చెప్పమంటే అభ్యంతరం లేదు.'

'నేను మీకష్టముంచుకుంటానుకోకండి—1940 వ. సంవత్సరంలో మీరూ నేనూ జాయింటుగా మందులవ్యాపారం చేసినట్లు, అందులో విశేషంగా లాభమొచ్చినట్లు, మీరు చెప్పాలి.'

'అంతా అబద్ధమేగదండీ!'

"మీరలా చెప్పినట్లయితే నాకు ఉపకారం జరుగుతుంది. ఇలాగే యింకో నాలుగయిదు వ్యాపారాలుచేసినట్లు, వాటిలో నాకు లాభమొచ్చినట్లు, ఋజువు చెయ్యడానికి అవసరమయిన సాక్ష్యులు, రికార్డు తయారు చేసుకుంటున్నాను.'

'ఏమయినా చేసుకోండి, నేనుమాత్రం బోనెక్కి ప్రమాణంచేసి అసత్యమును చెప్పను భగవంతుడి ముఖంచూచి బ్రతికేవాడిని.'

'ఇవి అటువంటి రోజులుగావండీ——రెండువందలిస్తాను.'

'లక్ష రూపాయిలిస్తే అబద్ధం చెబుతానా?'

'పోనీ అయిదువందలు పుచ్చుకోండి.'

'ఏమిటో——'

"నాకు ఉపకారం చేసినట్లు వుంటుంది—మీకు డబ్బు వస్తుంది.'

'మరయితే అయిదువందలూ ముందు వారేయండి.'

'అది ధర్మంగాదు సగండబ్బు ముందుపుచ్చుకోండి. మిగతాది తరువాత సాక్ష్యం అయిపోయిన వెంటనే."

'సరే—మీయిష్టం! నేను అయిదువందలకోసమూ ఒప్పుకోవడంలేదుసుమండీ! కేవలం మీమాటతో సెయ్యలేక అంగీకరించాను.'

'చిత్రం—చిత్రం. నేనూఅలాగే అనుకుంటున్నాను.'

అంటూ వియ్యన్నపంతులు, జేబులోనుంచి రెండు వందల ఏభై రూపాయలూ లెక్కపెట్టి గురులింగానికిచ్చి——

'మీకు వాయిదానాడొచ్చి తిరిగి చెబుతాను, ఈలోపుగా సమనువస్తుంది పుచ్చుకోండి.'

'సరే—ఒప్పుకున్నాక తప్పుతుందా?'

'ఈసాయంకాలమొకసారి మాప్లీడరుదగ్గర కొకసారి వచ్చినట్లయితే, రేపు మీరు కచ్చేరీలో ఎలాచెప్పవలసిందీ ఆయనవల్ల తెలుసుకోవచ్చు——'

'సరేలెండి.'

అని గురులింగం చెప్పినమీదట, వియ్యన్న, తనకు పనిజరిగింది గదా అని సంతోషపడుతూ వెళ్ళిపోయాడు.

'ఏమే—తెలిసిందా? విన్నావా?'

'విన్నాను. అయిదువందల పాటు.'

'తెలివితేటలంటేనావా? యింకెరివయినానా! బోనెక్కి రెండు చిలకపలుకులు పలికినందుకయిదువందల రూపాయలు.'

'అయిదు వందల రూపాయలకూ మళ్ళీ ఎప్పుడెన్ని కాసులొస్తా
యీ?'

'పది పదకొండు కాసులొస్తాయి.'

'తీసుకొస్తారా?'

'మిగతా రెండు వందల ఏభై రూపాయలూ కూడా వచ్చాక
తీసుకొస్తా.'

'అలా యెందుకూ? ముందీ డబ్బు కెన్ని కాసులొస్తే అన్ని కాసు
లూ తీసుకురండి. తరువాత మళ్ళీ తీసుకురావచ్చు.

అని గంగమ్మ భర్తను వెంటనే బజారుకు పంపించింది.'

'తెలివితేటలంటే నాభర్తవిగాని, యింకెవరివీ కావు. రోజు
రోజుకూ ఏదో ప్లానుమీద వందలకు వందలు సంపాదించిపోస్తున్నారు.'

అని గంగమ్మ భర్త యొక్క తెలివితేటలను తలుచుకుని తనలో
తానానందపరవశురాలు కావడం మొదలుపెట్టింది.

---

## ౨

'చూస్తుండగానే గంగమ్మ ఒంటినిండా ఎన్ని ఆభరణాలు దిగేసు
కుందో! చూశారా?'

'అది వాళ్ళ అదృష్టం!'

'అదృష్టం గాదండీ! తెలివితేటలు — ఇప్పుడా డాబాయింటిమీద
బ్రహ్మాండమయిన మేడ వేయించడానికి ప్రయత్నంట!'

'సరే—అయితే యిప్పుడు నన్నేం చెయ్యమంటావు?'

'ఏమీ చేయొద్దు. పెట్టెలో ఏమయినా వున్నాయేమో — తీసుకు పోయి అమ్ముకురండి.'

అని భాగ్యలక్ష్మమ్మ అనేటప్పటికి ధర్మారావు విరగబడి నవ్వడం మొదలుపెట్టాడు.

'ఎందుకొచ్చిన నవ్వండీ అది? నాకేమీ తెలియదనుకున్నారు గాబోలు! మీరు పెట్టెలో వున్న పుస్తెలు తాడు పట్టుకుపోవడము ఆగురు లింగంగాడు బంగారం చేయిస్తానంటే మీరా మాటలు నమ్మి వాడికి వంద రూపాయలియ్యడము — వెండివశనపరము, కొని వాడి యెదాన్ని పెట్టడము — నాకన్ని తెలుసు.'

'ఎవరు చెప్పారే!'

'అమ్మాయి చెప్పింది.'

'ఏ అమ్మాయీ?'

'మన పూర్ణ.'

'దానికెలా తెలుసు.'

'గురులింగము — పెళ్ళాము మాటలాడుకొంటూ వుంటే వినదిట! పెట్టెలోని పుస్తెలతాడును పట్టుకుపోవడం నాకే తెలుసుననుకొండి.'

'దగా చేశాడు గురులింగంగాడు!'

'గురులింగమన్నమాటేమిటి? మీలాంటి వాళ్ళ నెవరు పడితే వాళ్ళే దగా చెయ్యగలరు. ఇంత అమాయకత్వంగా వుంటే రోజులు గడవడానికిదేమయినా ధర్మకాలంటండీ?'

'పోనిస్తూ! ఆ గురులింగంగాడేం బాగుపడి యేడుస్తాడు?'

'అదీ యిహ చేతగాని మాట!'

'డబ్బుకోసం నానాగడ్డీ తింటాడు. రెండొందలుచ్చుకుని, చెప్పు దెబ్బలు తుడిచేసుకున్నాడు. కూరలముండ నీదగా — గోంగూర వాడినీ ద్రోహం.'

'అటువంటివాళ్ళు కేసోజులు.'

'అయితేకానిమ్యి. అటువంటి నీచకార్యాలు నావల్లకావు. నాలుగుడబ్బులొస్తాయంటె కచ్చేరీ కెక్కి ప్రమాణాలుచేసి తప్పుడుసాక్ష్యాలుకూడా ఈయడానికి తయారు.'

'అవును. డబ్బుకావాలన్నవా రన్నింటికీ తయారుగావుండాలి. ఆత్మగౌరవాన్ని నాశనంచేసుకోవాలి. ఈపద్ధతులన్నీ నేనూ ఆలోచించాను. బ్రతకిననాలుగురోజులూ, కడుపుకు తిండి లేకపోయినాసరే పరువుగా బ్రతికాలి—భగవంతునిముఖంచూడాలి.'

'సరే అయితే—అటువంటిగొట్టెలకెప్పుడూ బెత్తెడేతోక.'

'అయితే అయింది. బారెడుతోకను పెంచినవాళ్ళు చచ్చేటప్పుడేమయినా పట్టుకెడతారేమో నేను చూస్తాను''

''మరయితే, డబ్బులేదు—డబ్బులేదు. అని అఘోరిస్తుంటారెందుకూ మధ్యమధ్య?''

'అజ్ఞానం—పాపభీతి, మానాభిమానాలు, ఒదులుకున్నట్లయితే సునాయాసంగా డబ్బు పెరుగుతుంది.''

''అయితే యిప్పుడు డబ్బుగల శ్రీమంతులందరూ వాటిని ఒదులుకున్నవారేనా?''

'ఏమో—సత్యమును నమ్ముకుని ఆత్మగౌరవంకోసం పాకులాడినంతకాలం నువ్వు చెప్పినట్లు గొర్రెకెప్పుడూ బెత్తెడేతోక.'

''అటువంటప్పుడు డబ్బు లేదనుకోకూడదు.'

'అజ్ఞానంవల్ల నేనూ కొంతకాలం అన్నిప్లానులూ వేశాను. దొంగనోట్లు తయారుచేసి జైలుకెళ్ళినవాళ్ళను చూశాను. భార్యలను తార్చి డబ్బు సంపాదించినవాళ్ల నెరుగుదును. అన్నమమ్ముకుని శ్రీమంతులయిన వాళ్లను చూస్తున్నాం, ఫోర్జరీలుచేసి ధనార్జనచేసిన వాళ్ళూవున్నారు. అన్నిటినీ చూసినతరువాత నాకిప్పుడు డబ్బంటే చాలాఅసహ్యం కలిగింది.'

'సక్రమంగా తెలివితేటలవల్ల డబ్బు సంపాదించినవాళ్లులేరు? వ్యాపారాలవల్ల వృద్ధిలోకొచ్చినవారు లేరు?"

"నాకామాటలు చెప్పొద్దు, ఒకరిదగ్గరిడబ్బు యింకో యింకోరి దగ్గరకు రావాలీఅంటే, అప్పుడేవుంది మాదర్జోచ్చేదీ— అక్కడేవుంది. అక్రమం—అసత్యం, దానినుచ్చ వ్యాపారమేఅను—తెలివితేటలేఅను— ఎన్ని అక్రమాలుచేసి సంపాదించిన డబ్బులోనయినా, ఒక్క రాగి వయినాకూడా రాదు మంచిచెడ్డలు రెండే యీప్రపంచంలో మిగిలేవి'

'ఓయబ్బో! అయ్యగారికి మాగొప్ప వేదాంతం పట్టుపడిందే!"

'అవును—చెప్పుదెబ్బలు—నలుగురచేతా—ఛీ! ఛీ! అనిపించుకుని నాలుగుడబ్బులు కూడబెట్టడం దేనికే! ఎవరినీ దగాచెయ్యవలసిన అవసరం లేకుండా—ఒకరిచేతమాట పడనక్కరలేకుండా గౌరవంగా బ్రతకమని భగవంతుడు నాకో స్కూలుమేష్టరీ ఉద్యోగమునిచ్చాడు. నెలకు ఏభైరూపాయిలొస్తాయి. కుర్రకుంకలకు నాలుగక్షరం ముక్కలు చెప్తుకొంటూ, ధర్మంగా జీవనం చేయొచ్చు—ఇంకేం గావాలి?"

"మీహృదయ మటువంటి తృప్తిని కలిగివున్నప్పుడు నాకేనా యేమిటి? ధర్మంగా జీవనం చెయ్యడమంటే, మీకంటే యెక్కువ యిష్టం నాకు.'

"అని ఆభార్యాభర్త లిద్దరూ మాటలాడుకొంటూ వుండగా, పూర్ణ నౌకరుచేత ఓబుట్టెడు మామిడిపళ్లు పట్టించుకుని వచ్చింది.

'తోటలోనుంచి వచ్చాయమ్మా మామిడిపళ్ళు.'

అంటూ, బుట్టను లోపలపెట్టింది.

'ఇక్కడ కెందుకు పట్టించుకొచ్చావమ్మా! మీయాయన ఏమయినా అనుకుంటాడేమో అంది లక్ష్మమ్మ.'

'ఛా! ఆయన కటువంటి గుణాలులేవని తెలిసివుండికూడా అలాఅంటావేమే అమ్మా! తోటలోనుంచి అయిదుబుట్ట లొచ్చాయి.

'రెండుబుట్టలు మీఅమ్మగారింటిదగ్గర పడేయించు' అని వారు నిన్ననే చెప్పారు. అయితే యింకా అన్నిబుట్టలూ ముగ్గలేదు అంచేత యీ ఒక్కబుట్టా మోయించుకొచ్చాను. ఒకబుట్టవిప్పి, అక్కడగంగమ్మగారికీ వాళ్ళకూ పంచిపెట్టాను.'

'గంగమ్మగారు మళ్ళీపొత్తుకలిపిందన్నమాటే—'

'తిక్కరండ. అన్నట్లుచెప్పడం మరచిపోయాను. మేడ పూర్తి అయ్యేటప్పటికింకా రెండుమూడుమాసాలు పడుతుందన్నారు మీ అల్లుడు. అంతవరకూ యీగురులింగంగారియింట్లో బాధలు పడుతూ వుండడ మెందుకని, వేరేయిల్లు చూడమన్నాను వారుచూశారుకూడ.

ఈసంగతి తెలిసిందిగాబోలు, గురులింగమూ పెళ్ళామూవచ్చి, నిన్నటిరోజున సిగ్గులేకుండా సావిట్లో కూచున్న మీఅల్లుడిగారి రెండు కాళ్ళూ పట్టుకున్నారు. మీరు మాయింట్లోనుంచి వెళ్ళడానికి వల్ల గాదు. మీరుమేడకట్టుకోవడం పూర్తయినాక చూసుకోవచ్చు. అంత వరకూ మాయింట్లోనేవుండాలి. మేము తెలియక ఏమయినా తప్పుచేస్తే మరోరెండు చెప్పుదెబ్బలుకొట్టండి—'

అని బతిమాలడం మొదలుపెట్టారు.

'రెండుచెప్పుదెబ్బలుకొట్టి, మళ్ళీ యింకో రెండువందలుకూడా ఈయాలా?'

అని ధర్మారావడిగాడు.

'ఆత్మగౌరవంలేని మనుషులకేమిటే? నిన్నగాక మొన్న అంత గొడవయిందా — నిత్యమూ ఎందుకోఒకందుకు సాధించిపోస్తుందా! తిరిగి కాళ్ళుపట్టుకుని బ్రతిమాలడం!'

'అందుకల్లుడేమన్నాడు?'

'ఏమంటారు? ఇంట్లోనుంచివెళ్ళమనిచెప్పేవరకూ పట్టుకున్న కాళ్ళువొదలిపెట్టందే!'

'ఆయింటికి పదిహేనురూపాయ లెవడిస్తాడు? అద్దెడబ్బులుపోతా యని ఏడిశారు.'

'నేనుచెప్పాను. మాటమాటకీపేచీలు పెడుతూ సాధించిపోస్తుంటే నేనుండనని ఖచ్చితంగాచెప్పాను. ఏమీఅనమని మొగుడూ పెళ్ళాం లిద్దరూ లెంపలు వేసుకున్నారు.'

'అయితే ఇప్పటింతకూ మీరుమేడకట్టుకొనేవరకూ, ఆయిం ట్లోనేవుంటారన్నమాట?'

అని తల్లిఅడిగింది.

'వాళ్ళువాళ్ళపట్టుకొని వొదిలిపెట్టకపోతే, అలాగేవుంటామని ఒప్పుకున్నారు మీఅల్లుడుగారు.'

'సరేవుండండి—ఇహపేచీ లేమీపెట్ట రేమో!'

'అబ్బే! మాటనిలకడలేని మనుషులు! ఇప్పుడన్నమాటలు రేపటికుంటాయని నమ్మకంలేదు. డబ్బుకోసం గడ్డితింటారు. ఇహ మంచీచెడ్డా లేదు. ఆమధ్య దొడ్లో వేసుకున్న పుల్లలు, పిడకలు, మాయమవుతుండేవి.'

'సరిసరి—ఇదొకటా!'

'ఆవిషయం తెలిసినప్పటినుంచీ వాటిని యింట్లోనే పడే యిస్తున్నాను.'

అని కూతురుచెప్పగా—

'డబ్బుసంపాదించడాని కవన్నీ మార్గాలమ్మా!'

అన్నాడు ధర్మారావు.

'మీనాన్నగారింతవరకూ అతనివిషయమే మాట్లాడుతున్నా రమ్మా! ప్రపంచతీరంతటినీ చూడగా, చూడగా, మీనాన్నగారికి డబ్బుమీద విరక్తి పుట్టింది.'

'లేకపోతే ఏమిటీ, అటువంటి వెధవబ్రతుకు?'

'నాఅభిప్రాయముకూడా అదేనమ్మా!'

'నాకూ ఆదిలో డబ్బంటే చాలా ఆశగావుండేది. కాని పనుల మీాదికి మనసుపోయేది. కాని యిప్పుడటువంటిదేమీా లేదు–బ్రతికినంత కాలమూ న్యాయంగా బ్రతికి–ఎవరిచేతా మాట అనిపించుకోకుండా చచ్చిపోదామని వుంది.'

'చచ్చిపోవడాలెందుకుగానీ మంచి చెడ్డలు రెండే యీ ప్రపంచంలో మిగిలేవి. అయినా నీకేంలోటునానా్న! నేనున్నాను–అల్లుడుగారున్నారు. నువ్వేంచెబితే చెల్లదు. ఏంకావాలంటేరాదు.'

'మాటచాలుతల్లీ! నాకేంగావాలీ–మీారందరూ సుఖంగా వుంటే అంతేచాలు.'

అని మాటలాడుకొంటున్నమాటల్లో వారికి కలిగిన మన శ్శాంతి–ఆనందము యింకెవరికి కలుగుతుంది?

---

## ౮

'చక్రధర్ రావుపవ్వూరు వెళ్ళాడే!'

'పొలాలమీాదికి శిస్తుకెళ్లాడు గాబోలు! ఈరాత్రికి రాడుట!'

"నీకెవరు చెప్పారు?'

'అతనిపెళ్లామే చెప్పింది, నన్ను తమయింట్లో సాయం పడుకోమంది.'

'నువ్వేమన్నావూ?'

'సరేనన్నాను.'

'అయితే మనమీారాత్రి ఓపని చెయ్యాలి.'

'వెండిసామాను సంగతేనా? నాకు జ్ఞాపకముంది. అందువల్లనే ఆమె పడుకోమనగానే సరే నన్నాను—'

'ఊఁహూఁ! నువ్వు ప్రయత్నంమీదనే వున్నావన్నమాట?'

'మనం సంగ్రహిస్తున్నామని, దొడ్లోని పుల్లలుపిడకలు—యింట్లోకి పట్టుకుపోయి పెట్టుకున్నారు.' అందుకు వాళ్ల తెగులు చప్పగా కుదర్చాలిరాత్రి. రెండు బీరువాలనిండావుంది వెండిసామాను.'

'గట్టిగా మాటలాడకూమరీ! నువ్వు భోజనమైపోయినవెంటనే వాళ్ళయింట్లో కెళ్ళి పడుకో. ఓరాత్రివేళ, అనగా గడియారం, సరిగా వొంటిగంట కొట్టినతరువాత, పూర్ణ గాఢంగా నిద్దరపోతున్న సమయమును గమనించి, వీధితలుపు గడియతీసెయ్యి. బీరువాతాళాలెక్కడ వుంటాయో కొంచం కనిపెట్టు—'

'నాకింతగా చెప్పాలటండీ? మీకు అర్థాంగినైయుండీ, యీ మాత్రం తెలుసుకోలేనూ?'

'ఈరాత్రికిమాత్రం అతి తెలివితేటలుగా ప్రవర్తించామూఅంటే రేపు వెండిసామానంతా పట్టుకుపోయి, కాసులుగా మార్చేస్తాను.'

'సరే—'

అని ఆనాడు భార్యాభర్తలిద్దరూ రహస్యాలోచన చేశారు.

చీకటి పడకుండానే పూర్ణ వాళ్ళయింటికొచ్చి—

'ఏమండోయ్! పిన్నిగారూ! ఈరాత్రికి మాయింటికి పడుకోడానికి రావడంసంగతి జ్ఞాపకముందా?' అని అడిగింది.

'ఏం? ఒంటరిగా పడుకోలేవూ?'

'అలవాటు లేదండీ! భయంగా వుంటుంది—'

'నువ్వంత బలవంతం చేస్తున్నప్పుడు రానంటే యేం బావుంటుందీ?'

'పెందరాళే భోజనంచేసిరండి—ఆకబురూ యీకబురూ చెప్పుకొంటూ పడుకుందాం, మీరు వస్తామన్నారుగదా అని వూరుకున్నా, లేకపోతే, మాఅమ్మకు కబురుచేసి రప్పించి వుందును.'

'ఎందుకమ్మా, ఒక్క పూటకు అమూలనుంచి యీమూలకు మీఅమ్మగారు రావడమెందుకూ? నేనొస్తానన్నాగా?'

'సరే—'

అని పూర్ణ తమవాటాలోకెళ్ళిపోయింది.

అనంతరం గంగమ్మ భర్తకు భోజనంపెట్టి తాను భోజనంచేసి భర్తతో మరికొంచెంసేపు ఏమేమో, రహస్యంగా మాటలాడిన అనంతరం పూర్ణగారింట్లోకి పడుకోడానికెళ్ళింది.

అప్పటికింకా పూర్ణభోజనంచెయ్యలేదు.

'ఏమమ్మా! నీభోజనమయిందా?'

'లేదండీ! మీరొచ్చాక సాయంకూచుంటారని వేచివున్నాను.'

'అయ్యో! అలాగా? అయితే కానియ్యమరీ? ఈవేళ నాకెందు చేతనో దీపాలుపెట్టకమునుపే కళ్ళుమూతలు పడుతున్నాయి.'

"నేను అయిదునిమిషాల్లో భోజనంచేస్తాను. పక్కలుసిద్ధంగానే వున్నాయిగదా!"

అంటూ పూర్ణ బీరువాతలుపులుతీసి, వెండికంచమునుతీసి, భోజనానికి కూచుంది. గంగమ్మ ఆమెభోజనంచేస్తుండగా దగ్గరకూచుని ఆకబురూ యీకబురూ చెప్పింది. భోజనమైపోయినతరువాత యింటి పనుల్లో పూర్ణకు కొంచెంసాయం చేసిందికూడా! అనంతరం యిరువురూ యివతలకొచ్చేశారు.

పూర్ణ బీరువాతాళా లెక్కడపెట్టిందీ గంగమ్మ జాగ్రత్తగా పరిశీలనచేస్తూనేవుంది.

అనంతరం యిరువురూ చెరోమంచంమీద పడుకున్నారు. గంగమ్మకు అంతకుముందే కళ్లుమూతలుపడుతున్నాయని చెప్పడంవల్ల పూర్ణ ఆమెనెక్కువగా మాటలాడించలేదు. అనతికాలంలోనే ఆమెకు నిద్రపట్టిపోయింది.

గంగమ్మమాత్రం కన్నుమూయ్యలేదు. మధ్యమధ్య గడియారం వయిపుచూస్తూ దొంగనిద్రనటిస్తూ పడుకొంది.

క్రమంగా గడియారంముల్లు అంకెలన్నింటినీదాటి, ఒంటిగంట మీదికొచ్చి ఠంగున ఒకటికొట్టింది.

గంగమ్మ పూర్ణవైపొకసారి చూచి ఆమె గాఢనిద్దరలో వుండడమును గమనించి మెల్లగాలేచింది, అలమారులోని బీరువాతాళాలు సంగ్రహించింది. వెండిసామానులుగలబీరువాల తలుపులనుకూడా తెరచి సిద్ధంగావుంచి దీపమును కొంచెంతగ్గించి చప్పుడుగాకుండా వీధితలుపు గడియతీసింది.

అంతకుముందునుంచీ అక్కడవేచివున్న గురులింగం చెవిలో మెల్లగా ఏమో చెప్పింది. అనంతరమతడు లోపలప్రవేశించాడు. భార్యాభర్తలిద్దరూ బీరువాల్లోని వెండిసామానుసంతటినీ ఒకదుప్పటిలో మూటగట్టారు. అనంతర మామూటను చంకలోపెట్టుకొని గురులింగం అవతలకుదాటాడు.

తీసినతలుపులను తీసినట్లేవుంచి గంగమ్మ ఏమీయెరుగనట్లు యధాస్థానంలోకొచ్చి పడుకొంది.

తిరిగి నిద్రలేవకపోవడంవల్ల పూర్ణకాగొడవేమీ తెలియనే లేదు.

సుమారు అయిదుగంటల తెల్లవారగట్ల చక్రధరావొచ్చి జట్కాదిగాడు. తమయింటితలుపులు బారుగాతీయబడివుండడమును తిలకించి గుండెలు బాదుకున్నాడు.

ఖంగారుతో లోపలప్రవేశించి చూచేటప్పటికి బీరువాతలుపులు కూడాతీయబడివున్నాయి. గంగమ్మ అతనిరాకనుగమనించి మరింత గట్టిగా గుఱ్ఱుతీయడం మొదలుపెట్టింది. పూర్ణసహజమయిన నిద్దరలో వుంది.

"పూర్ణా! పూర్ణా!"

అని చక్రధర్రావు ఖంగారుతో పిలిచేటప్పటికి ఆమెత్రుళ్ళిపడి లేచి—

'ఎప్పుడొచ్చారు—తలుపులెవరుతీశారూ?'

అని ఆశ్చర్యంగా అడిగింది.

'ఓసి మొద్దూ! యిల్లుదొంగలుదోచుకుపోయారు. వీధితలుపులూ బీరువాతలుపులు బారుగాతీసివున్నాయి.'

అని భర్తఅనగానే—

'దొంగలే—'

అంటూ గుండెలుబాదుకొంటూ, ఆమెభర్తతో బీరువాదగ్గర కెళ్ళి చూసేటప్పటికేముంది. ఒక్క వెండిసామానయినా లేకపోవడమును గమనించి కొయ్యబారింది.

వారిహడావిడినంతటినీవిని లేచినట్లుగా గంగమ్మ కళ్లునులుపుకొంటూ లేచి—

'ఏమిటమ్మా ఖంగారు! ఎవరొచ్చారూ?'

అని అతినిధానంగా అడిగింది.

'ఇంట్లో దొంగలడ్డారు—వెండిసామానంతా పట్టుకుపోయారు.'

అని పూర్ణ తడబడుతున్న గొంతుకతో అనగా—

'అమ్మనాయనో! దొంగలే—మాఆయనున్నపిలుచుకొస్తానుండండి

అంటూ గంగమ్మ గుండెలుబాదుకొంటూ పరుకెత్తుకెళ్ళి భర్తనులేపుకొచ్చింది.'

'ఏమిటండీ యీఘోరం! దొంగలుపడ్డారా? ఏంపోయిందీ?'

అని ఏమీ తెలియనట్లు గంభీరంగా అడిగాడు.

'పోతేపోయిందిలెండి—మనకు ఋణం లేనిదానిని గురించి విచారించకూడదు—పోయి పడుకోండి.'

అంటూ చక్రధర్రావు భార్యను గోకాడు. అతని అభిప్రాయమును గమనించిన పూర్ణ జరిగిన దొంగతనానికి లెక్కచెయ్యనట్లు పోయి పడుకొంది.

'ఇరవైయేళ్ళనగా యిల్లుకట్టి కాపరం చేస్తున్నాము. ఎన్నడూ పూచికపుల్ల పోలేదు! ఈనాడిదేం ఘోరం?'

అని గురులింగ మొకవయిపున, భార్య యింకోవయిపున దవడలు నొక్కుకోవడము మొదలుపెట్టారు.

'అయిపోయిందాన్ని గురించి విచారించడం నామతంగాదు. వరాకున తలుపులుతీసి పడుకునివుంటారు. ఎవరో లోపలప్రవేశించి, వెండిసామానంతా మూటగట్టి పట్టుకునిపోయి వుంటారు. నాకు లెక్కేమిటీ రేపుసాయంకాలానికి మళ్ళీచేయిస్తా, పాపం! మీనిద్దర పాడవుతూంది, పోయి పడుకోండి.'

అని చక్రధరావు చెప్పినప్పటికీ వెళ్ళకుండా, మరోకొంచం సేపు అక్కడే నిలుచుని, అనంతరం గురులింగం భార్య సహితంగా తమ యింట్లోకిపోయి, తలుపు లేసుకున్నారు.

'ఇదిగో! నేను పోలీసుస్టేషనుకెళ్లి యిప్పుడే వస్తానుగాని, నువ్వు జాగ్రత్తగా తలుపులేసుకు పడుకో. మన వెండిసామానంతా గురులింగ మింట్లోతప్ప యింకెక్కడా వుండదు. తెల్లవారిందంటే, వాడాసామాను మాయించేస్తాడు.'

అని భార్య చెవిలోచెప్పి, చక్రధరావు వెంటనే సైకిలుమీద పోలీసుస్టేషను కెళ్ళాడు.'

"డబ్బు లక్ష్యంలేదు మొసలకుండా వూరుకున్నారు."

అని గంగమ్మ,

'మన కేసయం—పోలీసులను పిల్చుకొచ్చి హడావిడి చేస్తాడేమో ననుకున్నాను.'

అని గురులింగం—

మెల్లిగా మాటలాడుకొంటున్న సమయం ఎవరో తలుపుతట్టారు గురులింగం ఆలోచించకుండా తలుపు తెరిచేటప్పటికి, అరడజనుమంది పోలీసులు—ఒక సబిన్స్పెక్టరు, బిలబిల లోపలదూరారు.

గురులింగానికీ, భార్యకూ, శరీరంలో ప్రాణాలులేవు.

పట్టెమంచంకింద డేగిశాలోవున్న మూట నివతలకులాగారు. పోలీసులు, చక్రధరావు విలాసాలతోవున్న వెండిసామానంతా ఆ మూటలో వుంది.

దంపతులిద్దరూ చక్రధరావు పాదాలమీద పడ్డారు. అపరాధము క్షమించవలసిందని వేడుకున్నారు, చక్రధరావు క్షమించదలచుకొన్నప్పటికీ, పోలీసు లొప్పుకోలేదు. భార్యాభర్త లిద్దరి చేతులకూ సంకెళ్లు తగిలించారు.

సూర్యోదయమయిందేమో—వూరుజనమందరూ అక్కడ మూగారు 'సంపాదించిన డబ్బంతా యిలాగే సంపాదించాము మహారాజా—చివరకు పాపం బద్దలయింది—

అని ఎవరినోటంటవిన్నా అవేమాటలు! చేసినఖర్మ ననుభవించడానికి గురులింగం దంపతులు పోలీసులవెంట పోయారు.

అనంతర మాభార్యాభర్తలిద్దరూ చెరోమూడు సంవత్సరాల కఠినశిక్షనూ చెరిసమానంగా పంచుకున్నారు.

డబ్బేప్రధానంగా గల జీవితాలకు ఎప్పటికయినా కలిగే ప్రతిఫలమిటువంటిదేగదా!

సమాప్తం.

Paper Supplied by Party Q. H. E. G. 34.

---

త్వరలో రాబోవునది!

కర్త కాదు

---

శ్రీరామాప్రెస్, రాజమండ్రి.